స్వరాజ్యమభిలషించెడి భారతీయు లవశ్యము చదువఁదగిన గ్రంథంబై యున్న యది వేయేండ్ల మొదటినుండియు భరతవర్షమున నున్న సుస్థితియు వర్తమానకాలపు దుస్థితియు నీగ్రంథము తెల్లముం జేసెడిని. అందలి పద్యంబు లన్నియు నమృతగుళికలేయైనను గ్రంథవిస్తరభీతిని గొన్నింటిమాత్రము చదువరులకు రుచిఁజూపెదము. దీని టైటిలుపై లోకోద్ధారకులగు లోకమాన్యబాలగంగాధర తిలక్ మహాత్మగాంధిగార్ల ఫోటోలును దీయఁబడియున్నవి. దీనివెల 0—4—0 వలయువారు గుంటూరు చంద్రికా ముద్రాక్షరశాలకు వ్రాసికొనవలెను.

సీ॥ సరసీతటాక నిర్ఝర దీర్ఘికల కేమి కలవనేకములు యోగ్యములు నదులు
అనుపమానములు లోహనిధానముల కేమి కలవు నానారత్న నిలయఖనులు
వివిధద్రుమకుడుంగ విపినంబులకు నేమి కలవు సుక్షేత్రపంటల పొలములు
శమదమాస్పద మునీశ్వరుల పల్లెలకేమి కలవు భాగ్యైక భోగ్యములు పురులు
గీ॥ పావనస్వచ్ఛగల కృషీవలుల కేమి కలరు నానా పరిశ్రమకుశలులు జనులు
శాంతికాధ్యాత్మిక ప్రభాభాగ్యమొక్క భరతజాతికెగాక యెవ్వరికిఁ లేదు॥

సీ॥ చాణక్యనీతితారాణ్యగా జంద్రగుప్తాది మౌర్యులు దేశమేలయునాఁడు
పరహింసవలని దేవత్వమేనిఁ ద్యజించు ఘనుఁడశోకుఁడు ప్రజల మనుపునాఁడు
జాతికవిత్వ విద్యాతత్త్వవర్ధనుండైన హర్షవర్ధనుండేలునాఁడు
కాకతీయాది సత్క్షాత్ర వంశప్రభుల్ నిరతి దేశంబుఁ బాలించునాఁడు
గీ॥ కృషియు, నానాపరిశ్రమల్ వృద్ధిఁజెంది నావికావర్తకము మహోన్నతివహించి
భవ్యవిభవానుభవమున భరతభూమి నాగరికతకు బ్రథమగణ్యముగనుండె॥

సీ॥ గతియింపలేదు లోకఖ్యాతమైన డక్కామల్లు నేతమగ్గములపనులు
కడముట్టలేదు బంగాళంబులోని మేల్వలి పెంపుఁ బట్టుపుశ్వాలువపనులు
చెడిపోవలేదు వాసింగన్నయా సామ సురభిరంగి పరిశ్రమములవృత్తి
నశియింపలేదు నానాసాగరములలోఁ గ్రాలుహైందవ నావికాచయంబు
గీ॥ ప్రబలమొగలాయి సామ్రాజ్యభానుబింబ మస్తమించెడినందాక నస్తమింప
నొచ్చదశనున్న దేశభాగ్యోదయంబు సమసె నీస్టిండియా వణిక్సంఘశక్తి॥

సీ॥ దుర్గంబులుగ మాఱెఁ దొలుత వాణిజ్యంబు కొలువుఁగట్టిన సరకుం గొట్టార్లు
మందు సామగ్రిగా మాఱె గిడ్డంగులందుంచు వర్తకవస్తుసంచయంబు
వీరసైన్యంబుగా మాఱెఁ గర్మాగార మునఁ గాచుచుండు కావలిజనంబు
చారలోకంబుగా మాఱె వ్యాపారంపు టాసుగండీయులు దుబాసుగాండ్రు
గీ॥ రాష్ట్రపతులైరి యిచట వర్తకమునడుపు ప్రతినిధు లనంతరము ప్రాచ్యభారతీయ
సంఘకర్తలె మనకు రాజ్యంబునకును భర్తలైరిట బహువిధోపాయములను॥

సీ॥ రాటముల్వడకు నారాటంబు లుడివోయె ముసలమ్మలకుఁ బనుల్ మూలఁబడియె
నేతమగ్గముల సంగాతంబు లుడుగయ్యె సాలెవాండ్రల పొట్ట సన్నగిల్లె

కొలిమితిత్తి దుకాణములు క్షీణమైపోయెఁ గమ్మతీకంపు బింకమ్మడంగ
నానాపరిశ్రమల్ నాశంబులై పోయెఁ గూలినాలిజనంబు గూలిపోయె

గీ॥ చేతిపనులెల్ల మిల్లులచేతసాగు పాపినాగరికంబిందు దాఁపరించి
కోట్లపనివాండ్ర స్వేచ్ఛతోఁ గూడుపోయె కఱవు నుసికొల్పె బహుళకుఁగాలమయ్యె

సీ॥ తన కార్మికాయుతనములఁ గూలికిఁ గాక తనయిచ్ఛనొకఁ డింటు మనికితగదు
తనకు నైపట్టు దారము చేయుటయె కాని యదివస్త్రముగఁ జేసియమ్మఁదగదు
తనయోడలే పదార్థములెత్తఁజనుఁగాని యుచటివాసీనకే యొఁగఁజనదు
తనకెత్తా మిప్పించు ధరకె కా కేడియుం కొకరికి స్వేచ్ఛ నమ్ముకొనరాదు

గీ॥ తనకులాభించి యిటఁ బరిశ్రమములెల్ల సనుయొటకునెన్నియెన్ని యత్నములు వలయు
నన్నియుంబన్ని దేశభాగ్యంబుగొనియె సరవి నీక్షిండియా వణిక్సంఘ మపుడు॥

సీ॥ పాంచాలికా పరాభవసంభవంబైన యాగ్రహంబు ప్రతిష్ఠితాగ్ని గాఁగ
ఆలీసహోదరుల్ లాలా పటేలాది దేశబాంధవులు ఋత్విజులుగాఁగ
ఆసేతు శీతాచలాంతరస్థంబు భారత జాతి హోతృవర్గంబుగాఁగ
ధర్మసంస్థాపనార్థం బుద్భవించు గాంధి మహర్షియే యుపదేష్ట గాక

గీ॥ పటుతరాధర్మమే యిందుఁ బశువు గాఁగ కాలపురుషుఁడే యాజిగాఁ గడఁగు నీమ
హాధ్వరమునకు సలుపుఁడో యార్యులార!, యాగసామగ్రి కొఱకు నాత్మార్పణంబు॥

శా॥ ప్రాజ్యంబైన స్వరాజ్యయాగక్రతువున్ బ్రాపించు సర్వప్రజా
భోజ్యంబియ్యది లేవిటన్ కులమతంబుల్ భేదముల్ దీనికై
త్యాజ్యం బొక్కటియే యదే మనిన హేయంబైన పేరాసక
ర్మజ్యేష్ఠుల్ వెఱపేల నిశ్చయమతిన్ రండాత్మ లర్పింపఁగన్

శా॥ ఏనాఁడీ మిడిమేలపుంజనువుకై యీజాతి యాశించెనో
ఆనాఁడే నశియించె వృత్తులును శిష్టాచారముల్ ధర్మముల్
జ్ఞానం బన్నది గేహదాస్యమున దీనంబైనన్ లేచి నేఁడే శుచి
స్నానంబుం బొనరించి కైకొనుఁడు స్వాతంత్ర్యాలంకృతిన్॥

మ॥ అనుమానింపకుఁడొక్కయేటనె స్వరాజ్యంబే మ సాధింతు నె
ట్టన నామార్గముఁబట్టి రండనిభరన్ ఢంకా బజాయించి చా
టిన గాంధీభగవానువాక్యముల నూటిన్ నమ్మి దీక్షామతిన్
చనుదెం టాదట సేమిలాభము? పరీక్షాభ్రాంతి యింకేటికిన్

శా॥ నన్నిశ్చేయమిదే ప్రపంచమున ధర్మస్థాపనార్థంబు సా
క్షాన్నారాయణమూర్తియే మరల నీగాంధిస్వరూపంబుగా
వెన్నాఁడా జగదేకనాయకుని వాక్యాల్ వేదముల్ భక్తిమైఁ ద
న్నామంబొకమారు స్మరింపుఁడమితోత్సాహంబు వీఁకయ్యెడిన్

## చోరపంచాశిక

కం॥ చోరులవిధమే నేఁబది యాఱుపద్దెముల నేర్చినంతను జెప్పెదీ
వారిని చెవిలోమాత్రము జేయుచుమిఁక దయ యెటున్న సీతారామా ॥

కం॥ కొందఱుపందలుభువిలో బందులవలె మ్రింగుచుంద్రు పరులది రుచిగా
ముందర జముశే గాసిం జెందెదమని తెలియలేరు సీతారామా!॥

కం॥ లోయక యిది మిక్కిలియు న్యాయమటంచాదిలోన ననదయగుచు నీ
హేయపుఁబనులనొనరిచెడి నీయనరేబుధులువాని సీతారామా!॥

కం॥ గట్టిగ గట్టినమాటల నెట్టోవిడఁదీసి దొంగిలించినమాత్రిం
దిట్టరి చూచినమీఁదటఁ జెట్టచెఱుగ యనుచువాని సీతారామా!॥

కం॥ పరువుఁ బ్రతిష్ఠయు మదిఁ గనికరముం బోద్రోచి పెద్దకఱవేరాని
సరసులు మాడివిత్తురె యచ్చెరువుఁ గాను నటులుందక్క సీతారామా!॥

కం॥ కపటమ మహాత్ములటంచును గనఁ డాత్మీయులనటించుఁ గనఁడు పరులటం
చును జే మాటికిముడి వేసినసిగ్గిఁడి మొండికట్టె సీతారామా!॥

కం॥ కూటికిరమ్మనియొన్నియొ మాటలుమంచివిగఁ జెప్పిమతకరియగుచున్
మాటలువారించుచెనటికిఁ జేటులురాకున్నె ముందు సీతారామా!॥

కం॥ ఈకాయముసతమనుకొని యేకాలము నదరుబెదరు నెఱుగక కటకట! యే
వో కూడులు దినుచుందురిసీ కాల్పనె వారిబ్రతుకు సీతారామా॥

కం॥ మాయూరెయొంతటికైనను. లోయఁదుదుజన నుఁడులోన లోపలఁదివలెన్.
మాయలుపచరించును జీచీయనినను సిగ్గుపడఁడు సీతారామా!

కం॥ హెచ్చగుదారిద్ర్యంబున బచ్చెపుదొంగగుచు భువినిబ్రతుకుటకన్నన్
మెచ్చఁగఁబెద్దలువాఁడికఁ జిచ్చునఁబడి చావమేలు సీతారామా!

కం॥ సతులకు సుతులకునైధన మతి [శయముగ గడనఁజేతు రా] యాసతులున్
సుతులున్వత్తురె తనతోఁ జితిఁ జేచెడికాలమందు సీతారామా!

కం॥ మంచిగమాటలఁ జెప్పుచు మంచిగఁదనునమ్మ నట్టిమాన్యులమాటల్.
గొంచెముఁ గనియట్లుంటన వంచెడి కాలమునఁగాదె సీతారామా!

కం॥ చుట్టాలమురపున్మని వాగ్గట్టినముడివిప్పి సొమ్ముగై కొనఁజేతుల్
కట్టా! యెట్టాడునొక్కో చిట్టపురాయా మనస్సు సీతారామా!॥

కం॥ బ్రతికినరోజులు మంచిగ. బ్రతుకవలెన్ లేక నూతఁబడవలె రాతిన్
గుతికకుఁగట్టుక యింతకు క్షితివేఱ్గతిలేమలేదు సీతారామా॥

కం॥ చేయుటొ పెద్దల పూజలు చేయుటొ నానావ్రతములుచేయుటొ క్రతువుల్
చేయుటొ దానంబు లరయ! చేయుట యీదొంగతనము సీతారామా!॥

కం॥ ఎగ్గనితలఁపక మదిలో బ్రెగ్గడలదె మాట దడవి పెంబోతువలెన్
బెగ్గలిక నుడిగి తిరిగెడు సిగ్గెట్టులేదొ తనకు సీతారామా॥

కం॥ గడనకుఁ బెద్దలమాటలు దడవుటయేకాక మంచిదారులలేదే
నడపీనుఁగనుచుఁ దిట్టరె చెడమడనరుఁ డిట్లుమెలఁగ సీతారామా!॥

కం॥ కొందఱు కన్నపుదొంగలుఁ గొందఱునగకత్తిరించుకొనువా ర్పగటే
యిందఱిలోబలువాసిం జెందెనుముడివిప్పుదొంగ సీతారామా!॥

కం॥ ఏజాతిపురుషుఁడైనను నీఁజాలినవాడెమేటి యితరులసొమ్ముల్
గాఁజేయువాడె యధముఁడు నీ జాతులతోఁ బనేమి సీతారామా!

కం॥ మంచికొలఁబునఁబుట్టిన మంచిగఁ బెఱిగినను ద్రవ్యమంతుండైనన్
సంచితకర్మం బునను నశించెడిగుణ మబ్బునుగద సీతారామా!॥

కం॥ సచ్చరితుల విత్తంబులు విచ్చలవిడిఁ దినుటకన్న వేర్గతిలేదే
యిచ్చంబెత్తఁగరాదే వచ్చెరఁ జూరాదె లేక సీతారామా!॥

కం॥ ఎల్లరుఁ దనుఁ జీచీయను పిల్లదముంజేసి యాడి ప్రల్లదము లరయ!
చెల్లునె సేర్పున నమ్మక చెల్లమటే మెలఁగనిసి సీతారామా!

కం॥ కనుమూసి పాలుద్రాపుచుఁ దను నెఱుఁగరటంచుఁ బిల్లి తలఁచినమాడ్కిన్
గనుగప్పి దొంగపని సేసినఁ గనరంచెంచు జడుఁడు సీతారామా!॥

కం॥ ఘనమునుజూచిన నెంతటి ఘనులకు విపరీతబుద్ధి కలుగు నిజముగా
మనుజాధములగు నెక్కటిచెనటులకుం బుట్టుటెంత సీతారామా!॥

కం॥అయ్యగారికిఁ దిరునామముఁ బయిలోడక పెట్టు నాలిముచ్చులకనువి
స్మయమేలా పరులయెడన్ జయిరాదే దొంగపనికి సీతారామా॥

కం॥పుట్టుకరేఁ సేచెల్లదరో పుట్టియు నేర్చెదరొ యీనిపుణతను ముడులన్
గుట్టుగవిప్పుట యందునఁ జెట్టలకుఁ బ్రతిష్ఠలేల సీతారామా॥

కం॥ఏవాసివన్నె నెఱుఁగని దేవన్నకు వట్టి పరమదేబెకు నీతుల్
వేవేలు సెప్ప నబ్బునె చేవాటుతనంబుగాక సీతారామా॥

కం॥లొగ్గిడితిండులు దినుచున్న గ్గింతయుఁలేక తిరుగు హీనుల గనఁగా
సిగ్గగుచున్నది వారికి సిగ్గేలా లేదొ లోనసీతారామా॥

కం॥ ఎనయఁగా నన్నిట దొంగయుఁ గన మానిసివంటివాఁడె కానీ నిలువె
ల్లనుజక్కఁగఁ బరికించిన వేఱొకసేల చూపు సీతారామా॥

కం॥ చేతుల దొంగతనాలను సేతురుకొంపలను గూల్చ నీకహాఁ మెనా
బూతులు దిట్టెద రహా! యీ సేఁతల కేమనఁగవచ్చు సీతారామా॥

కం॥ ముచ్చుతనంబున నెంచుట హెచ్చుగ ద్రవ్యంబుగూర్చ నిదిపాసఁగదు తా
ఱ్ఱచ్చెలగొట్టెద రడిగినఁ జెచ్చెర నేమెఱుఁగననిన సీతారామా॥

కం॥ బొక్కలుద్రవ్వి గణించుట కక్కురితియుఁ గాని తీయఁ గలకాలంబుఁ
జిక్కాని రొక్కము చూచినఁ జిక్కులఁబడనౌనుగాని సీతారామా!॥

కం॥ పన్నుగ మూడివిప్పుటలకుఁ బన్నుగడ ల్పన్నవచ్చుఁ బ్రక్కలు విటుఁగన్
దన్నెద రెన్నటికైనను జిన్నతనమువచ్చుఁగాదె సీతారామా!॥

కం॥ ఇక్కడి వారినికన్నులు మొక్కులముగఁ గప్పినను జముని నయనంబు
లెక్కమెకప్పఁగ నాతఁడు చెక్కులుగాఁ గోయుఁగాదె సీతారామా!॥

కం॥ నలుగురిలోఁ దలయెత్తుట కలదే యీజన్మమునకుఁ గలబందుగులో
చులకనగాఁ జూడరె జేజెలుమెత్తురె మెలఁగనిట్లు సీతారామా!॥

కం॥ ఎన్నడు నమ్మరు నవలా మిన్నలపొందులనుగోరి మెలఁగెడి చెడు దం
దన్నను గడు మూడివిడుపుంజిన్నెలుకలవాని నెవరు సీతారామా!॥

కం॥ ఏవారలు నిరసింతురు ఛీవాటులుగల్గు వచ్చుఁ జిన్నతనంబుఁ
బావాలదెబ్బలోదవును చేవాఁడితనంబు గలుగ సీతారామా॥

కం॥ ఆలికి నన్నము పెట్టుట చాలగ భరమయ్యెనేని చౌర్యముకన్నన్
గూలికిఁబోరాదే యది శీలమునకుఁ దక్కువగునె సీతారామా!॥

కం॥ ఇలదిన మెతుకులకఱవై మలమలమాడినను జాలమాడెద రిటు పె
ద్దలవిత్తము దొంగిలి గాసిలఁజేతురె మానవులు సీతారామా!॥

కం॥ పలువిధముల నార్జనమును సలుపుదురు నిజంబు దెలియఁజాలక యనరుల్
కలకాల ముండునేసిరి శిలలే చావుండుటకును సీతారామా॥

కం॥ ఎప్పుడో యేరోజుననో దప్పదుచా వెంతటి సరదారులకైనన్
దప్పక యిదె వచ్చెదనని చెప్పదుకద మిత్తి యెపుడు సీతారామా!॥

కం॥ ఇంతటిభాగ్యంబునకే యెంతటిద్రోహములనైన హీనులు చేతుర్
చెంతనె మృత్యువు కలదని చింతిల రదియేమొకాని సీతారామా॥

కం॥ చెంపలు గొట్టిన నోటన్ బెంపలు గాండ్రించి యుమ్మివేసినఁ గానీ
తెంపునఁ దలఁగొట్టిన లజ్జింపఁ డిఁకేమనిన ఖలుఁడు సీతారామా !॥

కం॥ మాటలు గాలికిఁ బోవును మాటలదొంగిలిన బెండ్లమును బిల్లలుఁ దా
బూటలుపడి తినవచ్చును జేటున కేమనును ఖలుఁడు సీతారామా!॥

కం॥ ఏరికి బల్ హైలపు వికారపుఁ జేష్టలును జాలఁ గండ్లకుఁ బొరలుచున్
గూర్చిరపుఁ జేష్టలు కాలము చేరువయగునపుడ పుట్టు సీతారామా॥

కం॥ తీఱదు ఋణము దరిద్రతదీఱ దితరధనము నెంత దిగమ్రింగిన హా
తీరు ఋణము చుట్టాలకుఁ జేరి ప్రభువు లింతవినిన సీతారామా॥

కం॥ ఎవ రెన్నినుడులు సెప్పిన సవరణగా వెప్ప దుష్టజనుల గుణంబుల్!॥
సవరించికట్టినా నెసని వెదుళ్లను గుక్కతోఁక సీతారామా !

కం॥ చేఁదును మనుజాఁడు దిన నాచేఁదాతనిజంపుఁ బుడమి జేజెలధనమున్
చేఁదూరక పోనేరదు చేఁదందతి ప్రాణములను సీతారామా !

కం॥ పాలునిద్రవ్యము బ్రిణయంబొరగఁదిన వంశమునకు హానికదా యా
పాడు దగాఁ జేసి [ధనముఁ] జేరుచుకొన నేమియగునో సీతారామా !

కం॥ మొంచికిఖండి యువన్నియు గుండెల కెగఁదట్టి కఫము గుటగుటయనునాఁ
డొండెను దెలిసికొనుం దనుజెండెడు నాఁడొండె యముఁడు సీతారామా !

కం॥ ఎన్నినుడు ల్వాఁగిన నవియన్నియు నొకయుప్పుగల్లుకైన న్రావం
జెన్నుచు దుష్టుఁడు దనపనిఁ జెన్నుగఁ జేయుచు నెయుండు సీతారామా !

కం॥ ఎప్పుడుఁ దుచ్ఛపుఁబనులే తప్పక సేయుచును బుధులు తగదన నెవియో
యొప్పుగ పిరంగనీతులఁ జెప్పు నిరుదలలశిఖండి సీతారామా !॥

కం॥ లాగ్గిడిపనులం జేయుచు దగ్గతి యుదితగు నెయున లడాయికిలోనై
బగ్గునపుండును నించుక సిగ్గగ్గునెఱుంగలేఁడు సీతారామా !॥

కం॥ కస్తూరితికి లోనగుచున్ గక్కినకూడులను మెక్కి కార్లలు చెడియా
కుక్కల కెనఁ దప్పొప్పులు చిక్కానె తస్కరతతప్ప సీతారామా!

కం॥ మునిముచ్చు తననుచేతను ధనమునుగడియించు కంటెఁదగురీతినినీ
యునదలుగడింతురే చచ్చిన నేమైమైనగాని సీతారామా!॥

కం॥ తద్దయు నే ముడివిప్పుల మొద్దులకును బుద్ధికలుగ ముఱిఁజేసిన యీ
పద్దెములను నర్పించితి సెద్దను బరికించికనుము సీతారామా!॥

చింతలపాటి రామమూర్తి శాస్త్రి

ఆ॥ శివసమానమైన శ్రేష్ఠమౌ దైవంబు గంగ ననుకరించు ఘననదియును
దయకుఁ దుల్యమైన ధర్మంబు హింసకుం దులితమైనపాప మిలను గలదె,, ౧౪౮

వ॥ అనిన విని పరలోకభయాతురుం డనఘుండే నహింసాస్వరూపంబు సకృత్స్నం
బుగఁ దెలిసికొనఁ దలఁచినవాఁడనై ౧౪౯

క॥ "అనఘా! పెద్దలవలనను వినియుండినవాఁడ నొక్క విషయము మును నే,
జనపాలురు వనమున మృగహననము గావించి పొందరఁటకద యఘముల్, ౧౫౦

క॥ మాంసము చిరజీవితమును మాంసలతయు నొసఁగు ననుచు మఱిమఱి దానిన్,
శంసయొనర్తురు వైద్యులు, హింసాకర్మంబు లేక యెట్లది పొసఁగున్, ౧౫౧

క॥ కావున నీవిషయంబున నీవ వచింపంగవలయు నిశ్శ్రేయసమై
తా వెలయునట్టిపద్ధతి, యావిధమున నడతు నే నిరాటంకముగన్" ౧౫౨

క॥ అనుటయు నపూర్వపురుషుఁ డిట్లను "నట్లనఁబోకుమయ్య, యయ్యది మాంసా
శనులగు నసాధువులమత, మెనయుం బాపంబు వారి నిప్పనివలనన్, ౧౫౩

క॥ అక్కట! క్రూరాత్మకులయి యక్కటికము లేక మాంస మనవరతంబున్
మెక్కెడి మూఢులకౌ స్థితి మిక్కిలి శోచ్యతమ మగును మేదినిలోనన్, ౧౫౪

క॥ కా దెలిచి యాయురారోగ్యాదులకుం గారణంబు క్ష్మామరవర! దు
ర్వాదమిది, విను వచించెద నీదానికిఁ దగిన మంచిదృష్టాంతంబున్, ౧౫౫

క॥ పొలసుం దిండులలోనను గలరల్పాయుష్కు లవని, గలరు సరోగుల్,
కల రొక్కించుకయైనను బల మంగములందు లేక పనవెడివారల్, ౧౫౬

చం॥ పొలదినకుండనుండు నరపుంగవులందును నెందఱో భువిన్
గలరు చిరాయువుల్, సుదృఢకాయులునుం గల, రామయాప్తి లే
కలరెడివారుగూడఁ గల, రందున దానికి దూరమందవ
ల్లిలవలె నెల్లవారు మహిదేవవరేణ్య! కృపావిశిష్టులై, ౧౫౭

ఆ॥ ఎవఁడు బ్రదుకఁ దలఁచి యిలనుండు జంతుల యూరువులను మెసవు నెసక మెసఁగ
వాఁడు ఘోరనరకవాసియై యాజంతుపటలిచేత నమలఁబడుచునుండు, ౧౫౮

క॥ ఒదవదు నంజాడు తృణమున, నొదవదు కాష్టమున, మఱియు నొదవదు శిలలో,
నెదొయొకజంతువు వాతమగు పిదపన యదియొదవుఁ గాన విడఁదగు దానిన్ ౧౫౯

ఉ॥ కాలికి ముల్లు గ్రుచ్చుకొనఁ గష్టమగున్ మన, కట్టిబాధ భూ
తాళికి నుండు శస్త్రములఁ బట్టి భువింబడఁద్రోసి కోయఁగన్,

నేలబహూకృతులింక, నిదియేకద మాంసము వర్జనీయమన్
గోలమునా నిదర్శనము కుంభినినిర్జర! యట్లుగావునన్ ౧౬౦
క॥ తమతోడం బోల్చుకొని యీక్రమమున భూతముల నెల్లం గనుఁగొనవలయున్,
దమశక్తికొలంది వానిని శ్రమపెట్టక ప్రోవవలయు సజ్జనతతికిన్, ౧౬౧
సీ॥ అఱకఁ గుత్తుకఁ గోయునటువంటివాఁడును నద్దానికనుకూలుఁడైనవాఁడు
ఖండఖండంబులు గావించువాఁడును నంగడిం గూర్చుండి యమ్మువాఁడుఁ
గ్రియధనంబునొసంగి కైకొనువాఁడును వలయువిధంబుగా వండువాఁడు
వలసినవారికి వడ్డించువాఁడును దినిలెస్సఁ "దృప్తోస్మి" యనెడువాఁడుఁ
దలఁప నెనమండ్రుగూడ ఘాతకుల, మఱియు నర్థమునొసంగి భక్షించి హత మొనర్చి
క్రయిక ఖాదక ఘాతక త్రయ మొనర్చువధము త్రివిధంబరయ యన్యవిధముఁ దనరు,
ఆ॥ గర్భమునను మదిని గాయంబుచేతను నెవఁడు హింససేయఁడించుకేని
వాఁడు మృతిజరావివర్జితంబైన యత్యున్నతంపుఁబదము నొందఁగలఁడు, ౧౬౩
తే॥ శాకమూలఫలాహృతి జరుపుకొనుచు బ్రహ్మచర్యవ్రతస్థుఁడై పరఁగుచున్న
యట్టివాఁడు నహింసకుండందుఫలము నంద నేరడు సర్వంసహామరేంద్ర! ౧౬౪
క॥ ఒక్కఁడు వర్షశతంబులు మిక్కిలి తపమాచరించు మేదినిలో, నిం
కొక్కఁ డహింసకుఁడయ్యెడు, నెక్కుడు వీరిరువురం దహింసకుఁడే యౌ, ౧౬౫
కం॥ ఎడఁద దయామయమగు నెడఁ బడయంగా రానియట్టి బలుకోరిక యున్
బడయంగఁగలఁడు మానవుఁ, డడుగం బనిలేద యేతదర్థము నింకన్, ౧౬౬
చం॥ తలఁచినచోటికెల్లఁ జను దండివిమానము నెక్కి దేవతా
లలనలుఁగొల్వ నూర్వరు విలాసముతోడ చిరంబునందుఁ దా
మెలఁగుచునుండు భూతదయ మిక్కిలిగల్గి చెలంగునట్టి యా
యలఘుఁడు భూమిదైవతకులాగ్రణి! వేలుపువోలెఁ బ్రీతిమై" ౧౬౭

వ॥ అనిపలికి యమ్మహాత్ముండు నేను విలోకించుచుండ విమానశ్రేష్ఠం బధిష్ఠించి గంధర్వులచే గీయమానుండును గిన్నరులచే స్తూయమానుండును నగుచు మదక్షరమంత్ర మాహాత్మ్యంబునం జేసి త్రిదశాలయంబునకుం జనియె, నట్లతండు చనుటయుఁ బూర్వాహితంబులగు సర్వంబులఁ దలంచుకొని యొడలు విఱిగినట్లుకాఁ జేసినపాపంబునకుఁ జింతిలుచు నదియు మహోత్సవంబునం జేసి "కట్టా! యూరుండనగు నాచే నెన్ని ప్రాణులు సమ

యింపఁబడిరో, మిత్త్రిఁగొంగంగూడ మిక్కిలి దూషించితిఁ, గావున నరకయాతనంబునం గూలవలసినవాఁడనైతి, నింక నేను హింసం బరిత్యజించి యుద్ధతపం బొనరించెద, శివదీక్షుం గైకొని సిద్ధేశ్వరుం బూజించెదఁ, ద్రిలోకంబుల జనులు దేనినైనను దపమ్మునచే సాధింతురుగావున నయ్యదియ యాచరింపనగు, నొక్కండన యొక్కొక్కదినం బొక్కొక్క వనస్పతికడ బికిరంబెత్తుచు మౌనవ్రతంబుఁబూని మునినై యమ్మునిపల్లెలెల్లం జరియించుదు, నిష్టానిష్టంబుల నన్నింటిని వదలియెవ్వతును శేషంకిన యింటనో రేఁడని యొకచెట్టు మొదటనో ధూళిధూసరితాంగుండనగుచుఁ బ్రివర్తించుదు'' నని యిట్లనేక ప్రికారంబుల విలపించి భక్తియుక్తుండనై శివదీక్షావ్రితంబును స్వీకరించి సిద్ధేశ్వరుని సమీపంబున నిత్యంబును త్రిసంధ్యలఁ బదివేలవడక్షరమంత్రింబు జపియించుచుండుటయుఁ దత్ప్రభావంబున శాకీయాత్మవనంబు సుస్థిరంబైనిలిచె, నట్లు లోకాంతరజ్ఞానంబును ఖేచరత్వంబునుం బడయఁగలిగితి, ద్వాపరాంతంబున సిద్ధేశ్వరునిలో నైక్యంబు నొందెద, నిదినిశ్చయంబు, సర్వపాపవినాశకంబు, మోక్షదంబు, ౧౬౮

కం॥ ఎవఁడీక ప్రతిదినమందును శ్రివణం బొనరించుచుండు శ్రద్ధాన్వితుఁడై
భవమాతి మరణమగువఱ కవివేకిత వాఁడొనర్చు నఘములు తొలఁగుక'' ౧౬౯

కం॥ కావున నీమంత్రంబును నీవు సదాజపమొనర్చు నిశ్చలమతివై
యోవిబుధ! పొందఁగలుగుదు భావంబునఁదలఁచు నెల్లపరమార్థంబుల్'' ౧౭౦

వ॥ అని యిత్తెఱంగున వత్సమహాముని చెప్పిన షడక్షర మహాత్త్వంబంతయుం జెప్పి మఱియు సూతుండు ౧౭౧

కం॥ మిముఁగూర్చి యుపదేశవాక్ప్రచ్చుమహా మంత్రింబుమహిమ సువ్రితులారా!
క్రిమముగవింటిని నేఁ బూర్వమునం దాసద్గురుఁడు వక్కాణింపన్, ౧౭౨

కం॥ పున్నముఁ గీరితి యాయువు వన్నెయు వాసియును శత్రువర్గక్షయమున్
మున్నగునన్నియు నియ్యది విన్నం జదివినలభించు వేయుంకేలా'' ౧౭౩

## —* సిద్ధేశ్వరోత్పత్తి *—

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయుఁ ఋషులతనింగనుగొని " సూతనందనా! భగవంతుండగు సిద్ధేశ్వరుం డం దేసిద్ధునిచే నర్చితుండయ్యె? నిదియంతయును విస్తరించి చెప్పు" మనవుడు సూతుండిట్లనియె, ౧౭౪

ఆ॥ హంససాదభేయుఁడగు నొక్కసిద్ధుండు మునులియుయ్యఁ గనక యనుత్రమెయుగము

సంగలార్చ్యుడును బృహస్పతికడకేగి భక్తిపూర్వకముగఁ బ్రణతిసలిపి ౧౨౫

కం॥ "సంతానప్రదమైతగు శాంతికమో వ్రతమొ తీర్థసంసేవనమొ నీ
స్వాంతమునకెక్కినది యిసుమంత వచింపంగదే సురాచార్య! కృపన్" ౧౨౬

వ॥ అనినవి బృహస్పతి చిరగుమాచరితధ్యానుండై "చమత్కారపురక్షేత్రంబునకేగి యచటఁ దపంబాచరించిన వంశోద్ధారకుండగు సుపుత్రుం బడయఁగలుగుదు, వింతకన్న శుభావహంబగు నుపాయంబు వేఱొకండు గానంబడ" దని ప్రత్యుత్తరంబిడుటయు నాసిద్ధుం డాక్షేత్రంబునఁ బ్రవేశించి ౧౨౭

సీ॥ శివలింగమునకుఁ జైఁ జేర్చెఁ బుష్పాంజలు, లుపహారముల నెక్కు డందించె నెదుట,
సుస్వరగానంబు సల్పె సన్నిధిఁ జేరి, వాయించె బహువిధవాద్యములను,
చాంద్రాయణ వ్రతాచరణదీక్ష వహించెఁ బ్రీణియించెఁ గావించి కృచ్ఛ్రములను,
మాసోపవాసము లనేకము లొనరించె, రచితపారాయణుఁడై రహిన్ వహించె,
నటు లహర్నిశంబు నగ్గలమగు భక్తిఁ బరమశివు నతండు పరిచరింప
జగముతల్లిఁ గూడి సాక్షాత్కరించెఁ దచ్ఛంకరుండు లోకశంకరుండు ౧౨౮

క॥ ఆమ్రేడితాని ద్విసహస్రాబ్దమ్ముల కాసాంబశివుఁడు తత్తపమున నా
ర్షమ్మంది నందిమీఁద రయమ్మునఁ జనుదెంచి యిట్టులనె సిద్ధునితోన్, ౧౨౯

తే॥ "హంస! సంతసమయ్యె నీవాచరించుతపమునం జేసినాఁడు, నేతత్ఫలంబ
యిచ్చిపోయెద నడుగు మభీప్సితంబు, పడయఁగారానిదని శంకపడకయుండ" ౧౩౦

వ॥ అనినవిని హంసుండిట్లనియె, ౧౩౧

క॥ "సంతతి పెంగలకోరికె నింతగఁ దపియించుచుంటి నిడుము సుపుత్రున్
సంతతసకలజగద్ధితచింతను నీలింగమందు స్థిరవాసుఁడవై" ౧౩౨

క॥ అనవిని భగవానుండను, "ననఘా! యిది మొదలుగాఁగ ననవరతం బీ
శునలింగ మాశ్రయించియు యెనికిం గావించువాఁడ యమ్మత్పూర్తిన్, ౧౩౩

తే॥ ఎవ్వఁడిందున్ననన్నుఁదా నిద్ధభక్తిఁ బూజితుం జేయు నేను దత్పురుషవరుని
హృదయగతమగు సకలంబు నిచ్చిపోత్రు, సత్యమియ్యది, లేదిందు సందియంబు,

తే॥ ఎవ్వఁడీలింగమునకుఁ దా నెదమపక్క సంస్థితుండయి శివషడక్షరజపంబు
సలుపు నవ్వాని కాయువు సంతతియును నొసఁగి క్షేమంబు వరయుచునుండునెపుడు"

వ॥ అని యిబ్భంగి వచించి శంకరుఁడు తా నంతర్ధానిం బొందుడున్
జని హంసుండు నిజాలయంబునకు సత్సంతానముం గాంచెఁ, గా

వున నీలింగము యత్నపూర్వకముగం బూజ్యంబు, వంద్యంబు, దే
వనికాయంబును బొందరానివ నా వాంఛ ప్రసాదించెడిన్ ౧౮౫

—• నాగహ్రద మాహాత్మ్యము. •—

చ॥ కలదట నాగతీర్థమన నాంబడు నొక్క హ్రదంబు, భక్తిం ద
జ్జలములం దీర్థమాడు నెడ శ్రావణమాసపుం గృష్ణపంచమిన్
గలుగదు సర్పభీతి, భుజగప్రభు వశ్యత రామ్యయుండగం
బలుడదుం దపంబొనర్చి రిట మాతృకృతోత్కటశాపముక్తికై, ౧౮౬

తే॥ శేషుండాదిగం దొమ్మండ్రు జిహ్మగులును భుజగనాయకు, లవ్వారిపుత్రపౌత్ర
బంధుమిత్రపరీవారపటలిచేత వ్యాప్తమైయుండెం దొల్లి యీవసుధయెల్ల, ౧౮౭

ఆ॥ లెక్కపెట్టరాక లీలమెలంగు నాపడగదారికోలను ప్రజలంబట్టి
కఱచిచంపుచుండం గళవళమంది వా రరిగి బ్రహ్మదేవు శరణంజొచ్చి ౧౮౮

ఉ॥ "పాములచేత నెల్లపుడు భక్షితమైనశియించుచున్న దో
స్వామి! సమస్తమానవుల సంతతియంతయు దక్కమున్న నీవు చు
మ్మీ మముగన్న, సర్పముల యుర్విజనుస్థమునాక్రమించె, నీ
కేమని తెల్పువారము వియిష్టమొనర్చెడి నష్టకృత్యముల్" ౧౮౯

వ॥ అనియిట్లు మొఱపెట్టుకొనుచుండ నా ప్రజాపతి శేషుండు లోనుగాంగల
నవనాయకులం బిలువంబంచి "జనసంతతి మకరమైన మీ సంతతికి బుద్ధిం జెప్పుకొనుం"డని
యాజ్ఞాపించిన వారును "వల్లె"యని వినక, యైనను నాశీవిషంబులసంఖ్య యత్య
ధికంబగుటకతంబున నప్పటి యథాపూర్వంబుగన యాచరింపంబడుచుండె, మందలింపం
బడియుం బంచజనులం బంచత్వము నొందించుటను బహుమప్రధావిష్టుండై దేవతామధ్య
స్థితుండగు నాచతుర్ముఖుండు సర్పకులాధిపతులం గనుంగొని యిట్లనియె, ౧౯౦

ఉ॥ "తప్పొకయింతలేకమను ధాత్రిజనంబులంబట్టి చెడ్డవై
సర్పములన్నియుం గఱచిచంపుచునున్నవి, మున్నె మీకు నే
జెప్పినవాండ, చెప్పిన వినీ యవి లక్ష్యముసేయకున్న, విం
కెప్పటికిట్లు చేయనటు లేనిక నిగ్రహముం బొనర్చెదన్ ౧౯౧

కం॥ జనమేజయుండు నా నొకజనపాలుండు బయలువెడలు క్ష్మాస్థలిలోం, జే
యుసు నున్నెపుకటి, యయ్యెడ ననలుండు భీతుంచు సెరిదహింతుల మెల్లన్ ౧౯౨

చ॥ జననియుఁగూడ నిచ్చెను శాపము వీరికి, నస్మదుక్తి దా
నిన సుదృఢంబు చేసెడిని, రిక్షయమిత్యాది, మంత్రరాజిచే
తనయుని యాహ్వఁగాఁబడుచుఁ దప్పక మండెడి యగ్నిలోఁ దమ
తనయుఁడె? చిహ్నలు స్వకృతంబగు పాపము పండుచుండఁగన్" ౧౯౩

వ॥ అనినవిని ఫణిపతులు తోమ్మంద్రుఁడును గడగడవడంకుచుఁ గైదోయి మోడ్చి కమలాసనున కిట్లనిరి. ౧౯౪

ఆ॥ "విసము ముంచు పెట్టి వెన్క మమ్మందఱఁ బుట్టఁజేసితీవ పూర్వమందు,
జాతి శుచితమైన సరణి వర్తించు మమ్మేల కోపగించె దిట్టులార్య!" ౧౯౫

వ॥ అనినవిని హిరణ్యగర్భుం డిట్లనియె, ౧౯౬

క॥ పెట్టివిషంబు నుగోరలఁ బుట్టించిన మాట నిజము పూర్వము మిమునే,
పెట్టియపరాధమెఱుఁగని యట్టిప్రజం గఱచి చంపు టర్హంబగునే" ౧౯౭

క॥ అనవిని విషధరపతు లిట్లని, "రేమిటి కాగ్రహంబునందెదు మాపై,
జనులకు మాకును నెవ్వరొ యొక సమయమర్యాదఁ జేయఁగాదగు నింకన్, ౧౯౮

ఆ॥ అటులఁ గాకయున్న నమ్ము మింకెట కేని జనవిహీనమైన స్థలమునకును,
సర్పకులము మనుపు జనమేజయక్షితీణ్మఖకృతాగ్నిలోన మగ్గకుండ, ౧౯౯

క॥ త్వదభీష్టమైనమార్గం బిది యిది కేదో యిదకి మదిని నీఫణికులముల్
తుదముట్టకుండఁ జేయంగదవయ్యా బ్రహ్మదేవ! కరుణావతివై" ౨౦౦

వ॥ అనియిట్లు విన్నవించు నాగులం బొడఁగాంచి తమ్మిచూలి యిట్లనియె, "జరత్కారుండనునొక బ్రాహ్మణుండు బిడ్డలంగనఁ దలంచి పెండ్లికై పిల్ల నన్వేషింపఁగలఁ, డయ్యెడ మీకోలంబున జరత్కన్యయను నొకసురుచిరాంగి యవివాహితవర్తించు, నాతని కావరవర్ణినొసంగి పరిణయంబు గావించిన వారల కుదయించిన బిడ్డండు జనమేజయుసర్పయాగంబున మహీసురోచ్చార్యమాణ మంత్రాకృష్టంబులగుచు నగ్నికుండంబునకచ్చిపడుచుండ నందరుఁ దెంచి చావఁగామిగిలిన సర్పంబుల సంరక్షించెడి వతలవితలాద్యధోలోకంబులకేగి మీ రందవసించునది, భుజగానురూపంబులగు భోగంబు లందు మీకుంగాఁ గల్పించెదఁ, గావున మహీతలంబునుండి వేగంబ కదలిపొండు పోయి సురాసురులకును దురాపంబులగు భోగంబులఁ బుత్రపౌత్రసహితంబుగా భుజియింపుం"డని వాక్రుచ్చుటయు నాగులిట్లనిరి, ౨౦౧

ఉ॥ భోగములెన్ని యుండినను బోయివసింపఁగఁజాలముఁ జక్క మే
మాగుహలోన, నేటికిటు లాజ్ఞయొసంగెదు, భూమిలోని యే
భాగమునందొ యుండెదము, పంచజనంబులతోడ మాకు నీ
వేగతిఁగట్టుచేయ నటులే చరియించెద మో పితామహా!" ౨౦౨

వ॥ అనియిత్తెఱంగునఁ బ్రార్థించుటయు నవ్వాణీరమణుండు వెండియు నిట్లనియె.

ఉ॥ "శ్రావణకృష్ణపంచమిని సర్పములన్నియు నుండవచ్చుఁ ద
ద్జ్యావలయంబునందునఁ, దదన్యదినంబులయందుమాత్ర మ
చ్చో వసియింపఁగాఁదగమిఁ జొచ్చిగసాతల మందయుండఁగా,
నావచనం బలంఘ్య మహినాయకులార చనుండు నీరికన్," ౨౦౪

కం॥ కులముఖ్యులైనమీ రయ్యలఘుచమత్కారనగరమందున సతతం
బెలమినివసియింపఁగఁదగు, నిలఁదగదన్యహికులము నిజముగనచటన్ ౨౦౫

కం॥ తమతెరువు రానిప్రజ నక్రమముగ వధియింపఁదగదు కఱచి ఫణుల్, మం
త్రము లోపల తెలిసిన బుద్ధిమంతుల కొరఁగి యొండు దెస కరుగఁగనా" ౨౦౬

కం॥ అనియాగతి వచియించుడుఁ జనియెం బాతాళమునకు సర్పకులంబుల్,
ఘనులగుకులపతులంతఱు మనిరా క్షేత్రమునకేగి మహిమాన్వితులై, ౨౦౭

తే॥ అచట శ్రావణపంచమి నహిపతులకుఁ బూజగావింపనిష్టము ల్పొందునరుఁడు,
వానికులమున జనియించువారికేని యురగములనుండియేమాత్ర ముండదళుకు, ౨౦౮

కం॥ కలుగవు తద్వంశజులకు బలుతెగులులు, మారితెగులు ప్రాప్తింపదటుల్
కలుగదు భ్రాంతభయంబును, నిలఁదక్షేత్రంబుమహిమ మెంతటిదగునో, ౨౦౯

కం॥ తనయవిహీనుఁడచటికిఁ జని శ్రాద్ధంబాచరింప సత్పుత్రకులన్
గని పితరుల ఋణముండఁగు మునులార! తదీయమహిమమునఁ జేసి వెసన్, ౨౧౦

ఆ॥ గొడ్డురాలుగూడఁ గులదీపకుండగు కొడుకుఁగాంచి సుఖముఁబడయఁగల్గు
నాగపంచమీదినమున సూర్యోదయవేళ నచట స్నానవిధిని నెఱపి, ౨౧౧

ఆ॥ భ్రష్టరాజ్యుఁడగుచు బఱితెంచునొడయుండు నాగపంచమీదినమున నాగ
తీర్థమందుఁగ్రుంకి యర్థినాగులఁగొల్వ మగుడఁ బ్రాప్తరాజ్యుఁడగు రయంబు, ౨౧౨

ఆ॥ సర్పదష్టులగుచుఁ జనుసినయవ్వార లచట శ్రాద్ధప్రాప్తి నెనయుదనుకఁ
బ్రేతలై వసింత్రు, పెద్దనిదర్శన మిందఱి సేనన్నపుఁడ యిందులకును, ౨౧౩

## —• ఇంద్రసేనవృత్తాంతము •—

ఉ॥ ఉండెడునింద్రసేనుఁడను నొక్కమహీశుఁడు తొల్లి, మార్తురన్
జెండెను, నశ్వమేధములఁ జేసెను, నాతఁ డొకప్డు సెజ్జపైఁ
బండియుండ నింట నొకపాఁడుభుజంగము మేఁగుదెంచె నం
దుండియు, యేఁగుదెంచియును లబోయనఁ గోలనించె మేనునన్, ౨౧౪

ఆ॥ దించు తత్క్షణమున మించిన ద్విషవహ్ని యంగకంబులెల్ల వ్యాప్తమగుచు
మెత్తమీఁదనటులె నత్తమిల్లెను తోఁడు నిదుర తుదకుఁ బెద్దనిదుర గాఁగ, ౨౧౫

వ॥ తత్తనూభవుండు తద్దయుం జింతించి ౨౧౬

సీ॥ దహనసంచయనాది విహితకర్మంబంత స్మృత్యుక్తవిధముగాఁ జేసినాఁడు,
అస్థికల్ గైకొని యరిగి కాశ్నదతోన గంగాజలంబులం గలిపినాఁడు,
త్రైపక్షికాదిక తత్తత్సమాఖ్యలశ్రాద్ధముల్ పాయాలు సలిపినాఁడు,
అరిగి గయాక్షేత్ర మటు ఫల్గునినిమ్నగ విధితోడఁ బిండంబు వేసినాఁడు,
అన్నియుం జేర్చినాఁడు తనకన్నతండ్రి యుండుగల [illegible] మె నతండు కాని
ప్రేతభావంబు వదల దప్పిత కదేమి పాపకర్మంబొ జడదారిపుంగవులార! ౨౧౭

శా॥ అంతన్ బాష్పజలప్రపూర్ణనయనుండై వచ్చి స్వప్నంబునన్
వంతం గుందుచు బిడ్డ కిట్లనియె, "నో వత్సా! మదర్థంబు నీ
వెంతో కర్మమొనర్చియుంటి, వది నాకీ దాయె నొక్కింత మే
లంతంబొంది భుజంగమూలమునఁ బ్రేతాకారము న్వీడమిన్, ౨౧౮

వ॥ కావున నైశంబ చమత్కారపురక్షేత్రంబునకుం జని యందలి నాగతీర్థంబున స్నానంబొనరింపుము, దానంజేసి నేను ప్రేతాకృతిం ద్యజించి ప్రీతుండనయ్యెద" నని యతం డదృశ్యుండగుటయుఁ దత్కుమారుండు మేల్కాంచి భీతుడై పడియుండు పితం దలంచుకొని పిమ్మటం జోచి త్వరితంబ తత్తీర్థంబునకరిగి స్నానంబు సల్పి పురోహితుండై భోక్త
గా శ్రద్ధాసంయుక్తిని శ్రాద్ధంబు నిర్వర్తించె నంత ౨౧౯

కం॥ మరలఁ బిశాచమయగుచును దరిసెనమిడి స్వప్నమందుఁ దనకొమరునక
త్తటి నింద్రసేననామక ధరణీపాలుండు సేగిఁ దానిట్లనియెన్, ౨౨౦

శా॥ కాదొక్కింతయు లాభకారి సుత! నీ కావించు శ్రాద్ధంబు నా,
కీ దానంగల యట్టి కారణము నీకేఁ జెప్పెదన్ విన్ముమ

ర్యాదల్భిన్నములై తనర్చు నిచటం, బ్రత్యేక మత్రత్యమౌ
భూదేవాళియె శ్రాద్ధకర్మములలో భుక్తింగొనం బాత్రమౌ, ౨౨౧
చం॥ మఱియొకచోట నింద్యులనిమానుకొనందగు శ్వంగకాదులం
దఱు నిటవర్జ్యులయ్యెదరు, దానమఖవ్రతముఖ్యభూసురో
త్కరకృతయాజకత్వమునఁగాఁదగుకర్మములెల్ల నిష్పరీ
వరమునను౦డుబ్రాహ్మణుల వాక్యము చేతనె పూర్ణతంగనున్, ౨౨౨
ఆ॥ కర్మలోపముండుఁగాక విశేషంబుతీర్థవాసు లేగుదెంచియుటకు
సంతసంబుతోడ "సర్వము సంపూర్ణ"మనివచింపఁ బూర్ణమై చెలంగు, ౨౨౩
ఆ॥ తత్పరోక్షమందు ద్రవ్యమంత్రక్రియాదుల కొకింతకొఱత కలుగకుండ
నల్పనట్టిశ్రాద్ధములును సంపూర్ణత నందలేక వ్యర్థమగునుదనయ! ౨౨౪
కం॥ కావున నీపురమందలి భూవిబుధులఁ బిలువఁబంచి భోక్తృపదమునం
దావారిని నియమించి యథావిధి శ్రాద్ధంబుజరుపఁదగు నిటుపైనన్,, ౨౨౫
కం॥ అనియబ్బంగిని గలలో జనకుండు వచించిచనియె, క్షణదాంతమునం
దున మేలుకాంచి కొమరుఁడు వనటఁ జమత్కారనగరవరమునకరిగెన్, ౨౨౬
ఆ॥ అరిగి బ్రాహ్మణార్థ మన్వేషమొనరింప వీథివీథిఁబ్రతినివేశమందు
నందఱును ధనాఢ్యులైయున్నకతమున నొకఁడుగూడ దానికొప్పఁడాయె, ౨౨౭
సీ॥ దారిద్ర్యమనుపేర యేరికిం దెలియదు, కొంచెమే నెఱుఁగరు కొఁదలంబు,
కనఁబడరెక్కడ నకర్మిష్ఠులగువార, లుండఁడుపామండుఁ డొక్కఁడేని,
మంగళరవము రేయుమందిరంబునవిన్నఁ, బ్రతియింట నుత్సవప్రక్రమంబ,
వీథివీథినిగూడ వేదఘోషంబులే, ధర్మచర్చయె ప్రతిష్ఠలమునందుఁ,
బ్రాజ్ఞులైనట్టి యాజ్ఞికప్రతతి చెప్ప యజ్ఞమంత్రింబులే యెటకరిగివిన్న,
నన్నియుపపత్తులంగూడి యఱుచోట శ్రాద్ధపుంగూటికెవ్వండుసమ్మతించు? ౨౨౮
సీ॥ నెలమూఁడువానలు నిలిచివర్షించుచుఁ బర్జన్యుఁ డెచ్చోటుఁబాయకుండు
సకలసస్యములును సంపూర్ణఫలములై కనులపండువు సేయఁగలుగు నెందు
నావులు నజములుం గావలసినయన్ని క్షీరంబులిచ్చి మేల్సేయు నెచట
నఖిలసంపదలకు నావాసమై యేది కలవునకే సదా కలవుఁగూర్చుఁ
జోరభయంపడుచుండు నెచ్చోటఁ దెగులు కానఁగాఁబడ దెచట నకాలమరణ
మట్టి సర్వోత్తమంబైనయగ్రహారమున లభించునె యాబ్దికంబులను భోక్త,

ఆ॥ "మొఁగమువాఁడు లేదు మూర్ఖ! యెవ్వండు నీయాజ్ఞికంబులోని యన్నమునకు,
వందులోన నిద్ది యరయఁ జేరితి శ్రాద్ధ, మెవఁడువచ్చు దీని, కేగుమవల, ౨౩౦
తే॥ స్వర్గమార్గనిరోధంబు సలుపుకొనుచు నేలతిరిగెద వింటింటి కింక నీవు,
చను మిటుంగలబ్రాహ్మణు ల్బండకొపు, లెవని శాపాయుధంబున కేమఁటఁబడక"
ఆ॥ అనుచుఁ గఱ్ఱఁదీసికొని కొట్టఁబోయిరి తన్ని మంత్రిప్రమాణధరణిసురులు,
అంత నచటినుండి యత్యంతమగుచింత విన్నఁబోవు చతఁడు వెడలిపోయె,
తే॥ "ఏమి చేయుదు, నేనింక నెటకుఁజనుదు, నేమిగతి నాకుఁ జనవున కింక మీఁద"
యనివిచారించి మంత్రుల నందఱిని స్వగృహమునకుఁ బంపె వేగఁ దన్నృపసుతుండు,

వ॥ ఇట్లుకంచి యొక్కండ యుండుచు దేవశర్మయనువాఁడు తద్బ్రాహ్మణులలో నెల్ల దాక్షిణ్యభాజనుండనియు శరణాగతవత్సలుండనియు స్మృతిమార్గానుయాయి యనియు సాహితాగ్నియనియు విని యంత్యజవేషంబుధరించినవాఁడై యతికష్టంబున నత్యుపనీవరు మలోత్సర్గనికేతనంబుం బ్రవేశించి శోధింపంగడంగుటయు వెనుకటి విప్రాపరిశోధకుండు శేవేగపరుదెంచి కోపసంరక్తనయనుండగుచు నిట్లనియె, ౨౩౪
ఆ॥ "ఎచటనుండివచ్చి తీవు దురాత్మక! యస్మదీయవృత్తి కడ్డమగుచు,
వెడలు మిచటనుండి, వెడలకయున్నచోఁ జనుతు నిన్ను యమునిపాలికిపుడు" ౨౩౫
కం॥ అనియాగతి నడ్డముగం జనుచున్నను సరకుగొనక సంశోధనము౯
బొనరించె మఱుఁగుదొడ్డిని జననాథుం డట్టు లొక్కసంవత్సరము౯, ౨౩౬
ఆ॥ వత్సరాంతమందు వచ్చి యాపాకివాఁడరఁగి దేవశర్మ కిట్టులనియె,
"ఆర్య! యస్మదీయమగు గుదాశోధన మాచరింత్రె యమ్మ"స్వయాజులు? ౨౩౭
ఆ॥ అస్మదీయకర్మమగుఁగాని యిట్టిది యన్యజనులొప్పునద్ది కాదు,
అట్టినీచకృతిని నన్యుఁబ్రవేశింపఁజేసినాఁడ, విద్ది చెల్లునయ్య?" ౨౩౮
వ॥ అనినవిని దేవశర్మయిట్లనియె,
ఆ॥ "ఈరహస్యకృతికి నెవ్వాని నియమించిరొయొఱుఁగ నేను నీదయిదినిజము,
ఎప్పటట్టు లీవయేగి యికార్యంబు చేసికొమ్ము పొమ్ము శీఘ్రమింక" ౨౪౦
చ॥ అనవినివాఁడు వాఁడిగల యాయుధమొక్కటి చేతఁబూనియా
జనపతి దొడ్డిమూద్చ్నెద "జంపెదని" న్నని వట్టె వాగ్వ్యయం
బొనరుచుకొంచుఁ బైకిఁజన నొక్కప్రహారమువైచె ముష్టిచే
తనయుతఁ దుత్తమాంగమునఁ దక్షిణమందున గ్రుడ్లు వెళ్లి రాఁ౯ ౨౪౧